# శ్రీ లలితా మధురాక్కరలు



కవితా ప్రసాద్

# వందే పితరౌ



జ్యోతిష కలశాబ్ధి మథించి సుజ్ఞాన సుధలఁ గ్రోలి
చేతి నేనాఁడుఁ జేఁపక జ్యేష్ఠ కనుఁగుకొడ్కయ్యు
స్వాతిశయము లేక తనను నర్థించిన జనతతి
జాతకముల విప్పి నుడివి సంతృప్తులం జేసి వి
ఖ్యాతుఁడై యనారత వైదికాచార నిష్ఠా సుని
ష్ణాతుఁడై రహియించిన జనకుని స్మరియించెదం
బ్రీతి మద్గురుండునవు కామేశ్వర శర్మ జోసిన్
స్వాతి ముక్తాఫలామల సన్నుత స్వాంతమూర్తిఁ
బూత కవితాన్వవాయ విభూషణునిన్ సద్భక్తి
నాతఁడిడిన శిక్షణయు విద్యాభిక్షయును నేటికీ
భాతి ప్రతిఫలించెం గవిత్వరచనా సంప్రాప్తినిన్!
జోతలర్పింతును దలిదండ్రుల కినుమిక్కిలిగన్

– కవితా ప్రసాద్

# శ్రీ లలితా మధురాక్కరలు

## (శతకము)

రచన

**కవితా ప్రసాద్**

ప్రచురణ



**శంకరాభరణం**

శరణం పండిత మానసాపహరణం, శశ్వద్యశఃకారణం, సరసానందద వాగ్విలాస చరణం, శబ్దార్థ సంపూరణమ్।
చరదత్యద్భుత సత్కవీశ్వరగణం, సాలంబనం 'శంకరాభరణం', నిత్యమహం స్మరామి విలసద్ వాగ్దివ్యసింహాసనమ్ ॥

**శ్రీ లలితా మధురాక్కరలు**

రచన: కవితా ప్రసాద్



శంకరాభరణం ప్రచురణలు: 75

**ప్రథమ ముద్రణ**: ఏప్రిల్ 2023

**ప్రతులు**: 100

**ప్రాప్తిస్థానం**: Kavitha Prasad,
73-18-8/1F, S2 - Sree Nandanam Apt.,
Sree Balaji St., (Near Venkateswara Temple),
A.V. Apparao Road,
Rajamahendravaram-533103 (AP)
✆: 9490168907

**ముఖచిత్రం**: కదంబ కుసుమార్చిత శ్రీమత్ లలితా మహాత్రిపురసుందరీ మాత

**రూపకల్పన**: పంతుల విట్టుబాబు, హైదరాబాద్ ✆85550 82034
**ముద్రణ**: కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్ ✆9866661478



వాగ్దేవీ వరపుత్ర
సమన్వయ సరస్వతి
## బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ

# శ్రీ మాత్రే నమః

'తీపి యక్కరములలో తీపి యక్కరల నిమిడ్చి శ్రీ లలితా పరామాతను వేడ్కొను వఊకే తన పనిగా తగ నేలుకొన అమ్మ పనిగా ..' రచించిన అద్భుతాష్టోత్తర శత వినతి ఈ సత్కృతి. మధురాక్కరలు రస భావ నిర్భరాలై నిజమైన మధురాక్కర లయ్యాయి. చక్కని సంస్కృత సమాసాల పోహళింపు ఎంతున్నదో, అచ్చ తెలుగు పలుకు దొంతరల ముద్దు కూర్పు అంతున్నది. కవితా పరంగా ఎంత ఉత్కృష్టమో ఉపాసనా రీతిలో, వేదాంత చింతనలో అంత ఉన్నత భూమికలందుకొన్న గొప్ప రచనను చదివి పొందిన ఆనందం రసోవై సః. మోక్ష స్వరూపమైన దేవీ పద సన్నిధియే లక్ష్యంగా - 'మచ్చిత్త చాంచల్య నిర్మూలన మ్మొనర్చ', 'తాపత్రయపు లంపటమ్మిక బాప', 'పరము గూర్పంగ', 'ఇంక నీ వీటికిన్ నన్ను గొంపోవవే', అని వేడుకొన్న ఈ పద్యాలు పారాయణ యోగ్యాలు.

త్రిశతి, సహస్రనామావళి లోని నామాల సంబోధనలు ఔచిత్యంగా పొదిగి బీజాక్షర మహితంగా కొన్ని మలచి మధురాక్కరలను మంత్రాక్ష రాకృతులుగా ప్రత్యక్షం చేసారు. 'త్వక్స్థ' - అని ప్రారంభించి 'క్స్థ' ప్రాసను భావబంధురంగా నడిపిన ప్రతిభ (38) కొనియాడదగినది. ప్రతి పద్యం నూతనాభివ్యక్తితో చకచ్చకితంగా భాసిస్తోంది. 57, 61, 67, 72 - ఇలా పేర్కొంటూ వెళితే నూరు "శ్లోకాలు" చెప్పవలసి వస్తుంది గానీ, ఆర్ద్రమై ఉదాత్తమైన జీవుని వేదన, దేవీ తత్త్వ స్ఫురణ ఉదాత్త ధోరణిలో ప్రవహించాయి.

'అరయ నేగూటి చిల్క తానా గూటి పల్కాడు', 'మ్రొక్కినను వరమీని వేల్పు', 'తామరపాకుపై నీటిచుక్క', వంటి నానుడులు చిక్కని భావాలలో చక్కగా ఇమిడిపోయాయి. '.. ఆ తేనెల న్మునిగిన ఈగనైతిఁ దగఁ దేనీఁగఁ గాకపోతినె కదా'  'నీ దేవమానమ్మున శిశువు పాటి నరయ, సంవిత్తు నుగ్గుఁ బోయవె', '..చిన్న నాట నీ గుడిముందు జేరి యాడితి జాబుళ్ళు..' ఇలా ముత్యాల లాంటి పద్యాలు చదువరి మరువలేడు.

అమ్మవారి సాకార నిరాకార తత్త్వములు, కుండలినీ రూపం, శ్రీచక్ర స్ఫురణ అన్నీ అందంగా అమర్చుకొన్న రతనాల మాల ఇది. తన 'యెడంద నాటిన పదాలు విత్తులు' చక్కగా పండిన వైనం ఈ నూట యెన్మిది పద్యాలలో పరిమళిస్తూనే ఉంది. వీరు సత్'కవితా ప్రసాదా'న్ని అందించారు. "నా మూలదేశమునకు నన్బంపవే.." అనే ప్రార్థన, 'చేతులారంగఁ బూజించుచు', 'చేతమారంగ ధ్యానమ్ము చేయుచు', 'మూతి నొవ్వగా పొగడుచు' పలికిన మాట, ఈ పద్యాలు చదివేటప్పుడు  కొన్నిచోట్ల కళ్ళు చెమర్చాయి. ఇంకొన్ని తావుల విస్ఫారితాలయ్యాయి. మఱికొన్ని కెడల హాస ప్రకాశాలయ్యాయి. మొత్తంమీద భక్తి దీప్తి, శక్తి జ్యోతి నిండిన మయూఖ మాలిక ఇది. ఈ సత్కవికి అంజలిస్తూ

బుధజన విధేయుడు

సామవేదం షణ్ముఖశర్మ/..

ఋషిపీఠం
సికింద్రాబాద్
21.03.2023



## ఆచార్య డా. బేతవోలు రామబ్రహ్మం
(రిటైర్డ్) డీన్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, బొమ్మూరు
(రిటైర్డ్) క్లాసికల్ లాంగ్వేజెస్ విభాగాధ్యక్షులు,
సెంట్రల్ యూనివర్సిటీ, హైదరాబాద్

# నివేదన

శ్రీ కవితా ప్రసాదు గారు నాకు ఇటీవల పరిచితులైన పద్యకవి. ఓ.యన్.జి.సి లో ఉన్నతోద్యోగిగా చిరకాలం పనిచేసి పదవీ విరమణ పొందాక - తమ హైస్కూలు చదువుల నాటి పద్యకవితా వనవాటికి తలుపులు తెరిచి సంధ్యా విహారాలు ప్రారంభించారు. అలనాటి గురువులు వేసిన పునాదులు గట్టివి కనుక త్వరత్వరగా కావ్యనిర్మితులు చేయగలుగుతున్నారు. ఇది నా అంచనా.

వీరికి విశ్వనాథ వారు అభిమాన కవి అనడానికి ఈ మధురాక్కరలు ఒక ఆనవాలు. ఇటీవల ఈ ఛందస్సులో శతకాలు రచించినవారు ఉడ్డా ముగ్గురు కన్నా ఉండరు.

నా కెందుకో గానీ ఛందస్సులలో అక్కరలు అంతగా రుచించవు. వీటి గణ నిర్మితిలో సార్వత్రిక సారూప్యం కనిపించదు. దానివల్ల పఠన సౌలభ్యమూ, సౌందర్యమూ కొఱవడ్డాయని నా అభిప్రాయం. అయితే వీటిని శరభయ్యగారు (మల్లంపల్లి) చదువుతుంటే వినసొంపుగానే ఉండేవి. సరే. లోకో భిన్న రుచిః. అది అలా ఉంచుదాం.

ఇది శ్రీ లలితా మధురాక్కరలు. పేరులోనే తెలుస్తోంది - లలితా సహస్రనామాలు ఆధారచక్రాలుగా పరుగులు తీసిన కవితా శతాంగమని. లలితోపాసనకూ కుండలినికీ అవినాభావ సంబంధం. ఈ రెండింటి పరిజ్ఞానమూ ఈ అష్టోత్తర శతకంలో పుష్కలంగా తొణికిసలాడుతోంది. మూలాధార చక్రాధిదేవత గణేశుడి ప్రార్థనతో ప్రణవంతో ప్రారంభమైన తొలి పద్యంతో శ్రీ లలితా మకుటంతో ఉజ్జ్వలంగా సాగింది ఈ శతకం.

కవితా ప్రసాదుగారు ఉన్నట్లుండి ఎందుకనో మరి ఆచ్ఛికంతో వీరంగాలు వేశారు - అచ్చతెనుగు గ్రామదేవత ఆవేశించినట్లో - పూనినట్టో!! (బహుశ ఇది వీరి మీద అచ్చ పాల తెలుగు పర్తి వారి ప్రభావం కాబోలు!? వారికి ఇది అవసరం. అవధానిగా జగద్విఖ్యాతిని తెచ్చిన శ్రీవత్సం!! కవితా ప్రసాదు గారూ! మనకెందుకిది?! హాయిగా అందరికీ నచ్చే అందరూ మెచ్చే తత్సమ బహుళ భాషలో సాగుదాం). అచ్చ తెలుగు రచనలు యయాతి చరిత్ర నుంచీ బృహత్పరాభూతాలే. ఎవరి చెవికీ ఎక్కని కేవల ప్రయోగాలుగా మిగిలి పోయాయి. వందల పద్యాల కావ్యంలో ఒకటో రెండో అచ్చతెనుగు పద్యాలు "విరళ గణేయ భూషలుగా" అందగిస్తాయే తప్ప వాటితోనే విస్తరి నింపితే - ఎవరికీ సొక్కదు. ప్రకృత మనుసరామః -

ఈ శతకంలో 8, 12, 13, 15, 16, 20, 25, 32, 34, 38, 40, 43, 45, 49, 50 సంఖ్యల పద్యాలు సంబుద్ధి విశిష్టతకో, అనువాద చతురతకో, సమాస నిర్మితికో, ప్రాస నిర్వహణ వైదగ్ధికో - విశిష్టంగా భాసిస్తున్నాయి.

ఇక్కడి నుంచీ కవితా ప్రసాదు గారి అంతరంగం శృంఖలాలు వదిలించుకొని స్వాభావికంగా సహజ సుందరంగా స్పందించింది. వీటిలో భావపరమైన ఆర్తి, స్వచ్ఛత, నిజాయితీ, నేవళం, స్వీయముద్రా నిర్భరత (Originality), లాలిత్యం, గడుసుదనం - ఇత్యాదులు మనల్ని పలకరిస్తాయి. మనస్సులు పులకరిస్తాయి. 55 నుంచి 108 దాకా ఉన్న అక్కరలలో నా చేతిలోంచి ఒక టిక్కో(√) రెండు టిక్కులో(√√) పొందని పద్యాల సంఖ్య చాలా తక్కువ. మీరే చూస్తారుగా!! స్వాగతం! ఇది విభిన్నంగా ప్రత్యగ్రంగా రూపొందిన వినూతన శతకం. తీపి అక్కరాలతో నిండిన తీపి అక్కరల శతకం. శ్రీ లలితా పరదేవతకు చేసిన "నివేదన". శ్రీ కవితా ప్రసాద్ గారికి అభినందనలు.


శిష్ట్లా బాలప్రసాద
09.05.2022

విశాఖపట్టణం.

9848169769



బ్రహ్మశ్రీ కాశీభొట్ల సత్యనారాయణ

విశ్రాంత తెలుగు లెక్చరర్
విద్వద్విమర్శకులు

# కంటిపాపలో అమ్మ

శ్రీలలితా సహస్రాన్ని పలికిన వాగ్దేవతల వాక్కులు స్తుతి రూపాలు. అమ్మవారి వైభవాన్ని, అమ్మవారి సగుణ నిర్గుణ రూపాల్ని, అమ్మవారి దుష్టశిక్షణ కార్యాన్ని, బ్రహ్మమైన స్థితిని ఆ స్తుతి పలికింది. వారికి జీవలక్షణం సంసారబంధం లేదు. అందుకని దుఃఖ ప్రసక్తి ఉండదు. కవితా ప్రసాద్ గారు జీవలక్షణం సంసారదుఃఖం ఉన్న మనందరినీ దృష్టిలో పెట్టుకొని అమ్మవారిని అర్చించేరు. ప్రార్థించేరు. కనుక ఈ నతి నుతి వారిది మాత్రమే కాదు. ఆ తల్లి వారికి కవితా ప్రసాదాన్ని అందించింది. కైవల్యాన్ని కూడా ఇమ్మని వారి అభ్యర్థన. నా వంటి వాడికి మొదటిదే లేదు! సమయం చిక్కినప్పుడల్లా ఈ మధురాక్కరలను పారాయణం చేస్తే అది, దానితో మరొకటి దక్కవచ్చునేమో!

ఆంధ్ర సాహిత్యంలో అక్కరలకు చోటు తక్కువ. ఇది కన్నడం వారి సొత్తు. అనంతుడు తప్ప అప్పకవి వంటివారు అక్కరల గురించి మాటాడలేదు. తెలుగులో చంద్రగణాల ప్రసక్తి  చాలా తక్కువ. ఇవి కేవల మాతృగణ ప్రసక్తికి సంబంధించినా, వృత్తలక్షణాలకున్నట్లు యతి ప్రాస లక్షణాలున్నాయి.

కవితా ప్రసాద్ గారు "మధురాక్కర" లలో అష్టోత్తర శతస్తుతి ప్రార్థనల్ని చేసేరు. "శ్రీలలితా" అనేది చంద్రగణం. ఇది మధురాక్కర పాదంలో చివరి గణం. ప్రసాద్ గారు అమ్మవారి హంసగతి అనగా పాదాల దర్శనంతో పైకి వెళ్ళి ఉంటారు. అందుకే అమ్మవారి తలపై చంద్రదర్శనమై ఉంటుంది. అందుకే శ్రీ లలితా అన్నారు. చాలా చిత్రమేమిటంటే - లలితా సహస్రంలోని చాలా

నామాలు ఈ పద్యచ్ఛందంలో ఒదిగి పోవటం. "చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా" అనే నామం యతితో సహా ఈ ఛందంలో ఒదిగి పోయింది. శ్రీం, హ్రీం, ఐం, క్లీం, సౌః వంటి మంత్ర బీజాలు ఒక్కొక్క పద్యానికి ఎత్తుగడ కావటం, ఆ పద్య భావం ఆ బీజ భావం కావటం గొప్ప విషయం.

మఱ్ఱియాకు డోలన్నను మనుప మాధవుడనో - ఈ మాట అమ్మవారి భాగవతమే అంటుంది. తమ్మిపూలలో భావసౌగంధ్యమును నింపితే యేమి? నింపలేకపోతే యేమి? ఈశ్వరానుగ్రహ కారణమైన తుమ్మిపూలేమైనా తక్కువా! ఆ స్థితి కూడా లేని నా వంటి వాళ్ళెందరో!

41వ పద్యంలో - సుమతి శతక కర్త అన్నమాట సామాన్య క్షుద్ర దేవతల గురించి! తిట్టినా తిమ్మినా అమ్మే కదా! చాల బాగ అన్నారు. 54 వ పద్యంలో- విప్రత్వం వినా ద్విజత్వంతో చాలా మంది ఆగిపోయిన వారే. అమ్మకీ ఆహితాగ్ని ప్రయత్నంతో సంబంధం లేదు. పరమాచార్యులవంటి వారెలా తపస్సు చేసేరో అలా! అందుకనే ప్రసాద్ గారు అలా అన్నారు. బాధపడకండని మనల్ని ఊరడిస్తున్నారు. అలాగే మహిళాకామంతో ఈ కాలంలో ఎన్నో తప్పుడు మార్గాల్లో నడుస్తున్నారు. 71వ పద్యంలో - విరాధుడు భూమిలో పూడుకపోవటం - రావణుడు నేలపై మాడి మసి కావటం - శబ్దచిత్రం బాగుంది. 96వ పద్యంలో - "శ్రీ రామ రామ రామేతి". రామ శబ్దం ఎలాంటిదో అలాగే రామా అనే లలితా నామం. అదీ అంతే. మూడు సార్లు అనండి. వేయి సార్లు అనినట్లే అనే ఆలోచన చాల సుకృత లభ్యం. రా అంటే 2, మా అంటే 5. 2x5x2x5x2x5=1000. అలాగే 108 పద్యాలలో మూడు పద్యాలను పంచపాదుకల్ని చేసి, శ్రీమాతా.. మూడు నామాలలో మూడు శ్రీలను సాక్షాత్కరింపజేసి మనందరికీ అనర్ఘ్య కైవల్య భావనను కలిగించిన కవితా ప్రసాద్ గారిని అభినందిస్తూ కృతి చాలా బాగుందని నా ఆనందాన్ని వ్యక్తీకరిస్తున్నాను. శుభం.

కాకినాడ
26.04.2022.

– కాశీభొట్ల సత్యనారాయణ

# అవతారిక

శ్రీకరీ! నమ శ్శ్రీచక్ర చిద్బిందు సంవాసినీ!
నాక హరివిధీంద్రహర ప్రణామపణాయితా! యీ
వే కదమ్మ శ్రీవాక్కాళ్యవేలశక్త్యాత్మిక! చె
వ్వాకులఁ దపనోద్వధిపులనాడించు శ్రీలలితా!

శ్రీమత్కామేశ్వరీ పరదేవతానుగ్రహంతో "కావవే కామేశ్వరీ!" అనే ఒక శతకాన్ని ఇతఃపూర్వము యథాశక్తిగా ప్రకటించటమైనది. పెద్దలందరూ దానిని నిండు మనసుతో మెచ్చి ఆశీర్వదించారు. విశాఖపట్టణం "ప్రసన్నభారతి" ట్రస్టు నిర్వహించిన పోటీలో శ్రీమతి వేము లక్ష్మీకాంతమ్మ స్మారక ఉత్తమ శతక పురస్కారము (2021) కూడా బహూకరించబడినది. ఆ శతకంలో కామేశ్వరీ మకుటానికి అనువుగా అక్కడక్కడా మధురాక్కర ఛందంలోనూ పద్యాలను అల్లటం కుదిరింది. ఆ శతకాన్ని చదివి తమ ఆనందాన్ని ప్రకటిస్తూ కవి పండిత మిత్రులు బ్రహ్మశ్రీ కట్టా కార్తికేయ శర్మగారు (రాజమహేంద్రవరం) నాతో ముచ్చటిస్తూ ఏమఱుపాటున పద్యాలన్నీ మధురాక్కరలలో చాల బాగున్నాయి అన్నారు. ఆ శతకం అంతా మత్తేభ శార్దూలాలే. మధ్య మధ్యలో ఓ పదే మధురాక్కరలుంటాయి. ఐతే పరదేవతా పరమభక్తులైన వారి నోటినుంచి అలా అమ్మయే ఇచ్ఛానుసారం పలికించిందేమో! మధురాక్కర పద్యాలతో కూడా అమ్మ తనపై నాతో ఒక శతకం వ్రాయించుకొంటే బాగుండుననే సంకల్పం నాలో వెన్వెంటనే పొడమింది. ఆ తల్లి కృపతో ఇలా సాకారమైంది. ఈ ఛందంలో పాదం పూర్వార్ధం తేటగీతి వలెనే ఉంటుంది. ఉత్తరార్ధంలో ఒక ఇంద్రగణం మఱియు చంద్రగణం ఉంటాయి. తేటగీతి వలెనే యతి స్థానం. ఐతే ప్రాస నియమం ఉంది. అక్కర జాతిలో సుమధురంగా క్లుప్తంగా నడిచే ఛందం యిది. మధురాక్కరలు భారతంలో నన్నయ ఒకటి, ఎఱ్ఱన రెండు మాత్రమే వ్రాయగా, శ్రీ మద్రామాయణ కల్పవృక్షంలో కవిసమ్రాట్ విశ్వనాథ

వారు ఎక్కువగానే ప్రయోగించారు. నా ఎఱుకలో పూర్తిగా మధురాక్కరలతో రచింపబడిన మొట్టమొదటి కృతి బహుశః ప్రకృత ప్రయత్నమే కావచ్చును.

మాకు 9 వ తరగతిలో (1967) నీళా పరిణయము అనే ఒక అచ్చ తెలుగు పద్య పాఠ్యాంశం ఉండేది. కూచిమంచి తిమ్మకవిది. అందులోని అచ్చతెలుగు పద్యకవిత్వంపై నాకెందుకో అప్పుడే ఒక మక్కువ ఏర్పడింది. తర్వాత తిక్కనగారి పద్యాలలో ఆచ్ఛిక శబ్దాలు ఎక్కువగా ఉండటం కూడా నాకు నచ్చింది. ఇంతకు ముందు కూడా ఆచ్ఛిక శబ్దాలను ఎక్కువ వాడుతూ పద్యాలను వ్రాసాను. ఈ కృతిలో ఉత్తరార్ధంలో ఆచ్ఛిక శబ్దప్రాధాన్యం కల పద్యాలను ఐచ్ఛికంగానే రచించాను. అమ్మతో అమ్మ బాసలో కూడా మొఱ వెట్టుకొందామని. లోహపురుష్ అని సర్దార్ పటేల్ గురించి 9 వ తరగతిలో (1967) ఒక హిందీ పాఠం ఉండేది. రచయిత పేరు గుర్తు లేదు. ఆ పాఠం అంతా సంస్కృత శబ్దమయం. మా హిందీ మాష్టారు దానిని ఈసడించుకొనే వారు ఇందులో సంస్కృతం తప్ప హిందీ ఎక్కడుంది అంటూ. అలాగే తెలుగు కవిత్వంలో తెలుగును ఎక్కువ వాడుకోవలసిన అవసరం ఉంది. అచ్చతెలుగు అర్థం కాదు అందువలన ఆదరణ లేదనే అపప్రథ ఒకటి ఉన్నది. తత్సమ పదాలు మాత్రం ఎంతమందికి నిఘంటు దర్శనం చేయకుండా అర్థమౌతున్నాయి? ఇదింక వదిలేస్తే..

దేవీ భాగవతాన్ని మథించిన విద్వద్దిగ్గంతులు, సరస్వతీ వర ప్రసాదులు, ప్రసన్న మతులు బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ గారు, బ్రహ్మశ్రీ కాశీభొట్ల సత్యనారాయణ గారు, ఆచార్య బ్రహ్మశ్రీ డా.బేతవోలు రామబ్రహ్మం గారలు. వారి ముందు అంగుష్ఠమాత్రుడనే ఐనప్పటికీ అడిగిన తోడనే మన్నించి తమ విలువైన సమయాన్ని వెచ్చించి ఈ కవ్యర్భకునికి తమ స్పందనలనూ, ఆశీర్వాదాలను ఆత్మీయంగా అందించారు. తమతమ దృక్కోణాలలో భక్తి, తాత్త్విక, కవిత్వ పరంగా విశిష్టంగా విశ్లేషించి నన్ననుగ్రహించారు. వారికి నేను బహుధా కృతజ్ఞతా పూర్వక నతమస్తకుడను. కుదురాటగండ బ్రహ్మశ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ గారు ఈ రచనా భానూదయ వేళలో

అడ్డుపడిన సందేహ మందేహులను తమ వాగ్గాయత్రితో చెదరగొట్టి ప్రకాశమానం చేయడంలో చేయూత నిచ్చినందులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను.

కవి పండిత మిత్రులు శ్రీ విట్టుబాబు గారు అత్యంత శ్రద్ధతో ఈ పొత్తాన్నే కాక నా ఇంతకు ముందటి వాటిని కూడా బహుసుందరంగా డి.టి.పి చేసి వాటికి మనోజ్ఞ ముఖపత్ర కల్పనలు కూర్చారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

సరే! అమ్మ నేర్పిన, నాకు అలవడి, పలుక గల్గిన, కొన్ని మాటలతో అమ్మతో మరలా ఇలా కొంత వేడుకొంటూ, కొంత వేడుకగానూ, మాట్లాడుకొన్నాను. కానైతే ఇందులో విశేషం ఏముంది? అమ్మ నాతో మాట్లాడినప్పుడు కదా సంబరం! ఆవిడ కెంతమంది బిడ్డలో! వారిలో నేనే మూల ఉన్నానో! చలన్మీనాభ లోచన ఎప్పుడో అప్పుడు చూపు నిల్పక పోతుందా నా పైన! వాగీశ్వరి మాట్లాడక పోతుందా? నా వంతు వచ్చేవరకూ మాట్లాడుతూనే ఉంటాను. తాటంకయుగళీభూత తపనోడుప మండల వినకుండా ఉంటుందా! అఙ్గం గళితం.. నముఞ్చత్యాశావాయుః! ఈ ఆశను జగద్గురువులు నిరాకరించలేదు కదా!

నేనేమీ పెద్ద పండితుడను కాను. తండ్రి, పాఠశాల కళాశాలలలో గురువుల వలన కుల విద్యలైన జ్యోతిషాదులతో పాటు ఇసుమంత భాషా జ్ఞానం అలవడింది. దొసగు లగుపించిన యెడల సుహృదయ పఠితలు మన్నించ వేడుకోలు!

స్వస్తి సర్వేషామ్.

విధేయుడు

కవితా ప్రసాద్

రాజమహేంద్రవరము

శోభకృత్ ఉగాది







ఈ ఫోటోలను సేకరించి పంపిన
బ్రహ్మశ్రీ పసుమర్తి వేంకట దుర్గాసుబ్రహ్మణ్యం గారికి (బహుమంత్ర దీక్షా పరులు)
కృతజ్ఞతలు

# శ్రీ లలితా మధురాక్కరలు

## ప్రార్థన

శ్రీ గణాధిపు నుఊవు స్మరింతు సభక్తి సుప్త
భోగినీ మండలాధిదేవున్ వ్యాసలేఖకున్ మ
హా గణేశ నిర్భిన్న మహావిఘ్న యంత్రహర్షి
తాగణిత గుణప్రణుత పద్యరచనన్గడమెడపన్

గురువుఁ దండ్రియుఁ గూర్మి నాకుఁ దన విద్యలనెల్ల నే
ర్పి రహిాయింపఁ జేసిన గుణశ్రేష్ఠుడు కామేశ్వరున్
వరసుతిని రాజ్య లక్ష్మిన్వినతియింతుఁ గవితాన్వయాం
బర సవిత్రుడుపతి దీప్తమాన్యుల భక్తిమీఱన్!

నాటి సుకవిత్రయాది యీనాటికింగల తెనుంగు
మేటి కవిరాట్టులఁదెలతు మీఁదును గవిసమ్రాట్టు
మాటకన్వర్థరూపి రామాయణకల్పద్రువున్
నాటి నిల్పిన యా విశ్వనాథాన్వయాబ్ధిసృజిన్!

# శ్రీ లలితా మధురాక్కరలు

ఓం పరా! హాటకాభరణోజ్జ్వలా! హంసగతీ!
కింపచుఁడనై చరించితిఁ గించిత్తు దాతృత్వశీ
లంపు లేమి! విరక్తచుఁబ వియుక్తవై ననునా
లింపవే! ముక్తి రక్తుఁ బాలింపవే శ్రీ లలితా! 1

శ్రీం పదయుత బీజత్రయీ! శృంగారయోన్యసుదా!
చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా!
ఈంపిలు గలిదోషావకర క్రియా దుష్పంకపు
రొంపి దిగఁబడనీయక ప్రోవవే శ్రీలలితా! 2

హ్రీం సమాయుక్త! కామేశ ప్రియభామ! త్వచ్చరణ
పాంసుకణ ధారణాసక్త వాసవాది నతశిర
శ్శంసితముకుట ఖచిత ప్రస్తర సువిస్తారిత ద్యు
త్యంశురాజిత పద్మపాదా! నమ శ్శ్రీలలితా! 3

క్లీం కళాత్మికా! అరజస కేళి లీలాకల్పిత
పంకజాత భవాండ సంభార! పాతక నాశినీ!
లెంక నను శివజ్ఞానమిడి కృపఁ గావఁగ రావె! య
హంకృతి విముక్తుఁ జేయవె! హంసినీ! శ్రీలలితా! 4

ఐంద్రియే ధ్యాంధ్య సంవృతానాకలిత ప్రజ్ఞాన
కేంద్ర! త్వన్మీన నేత్ర వికీర్ణ కారుణ్య శర
చ్చంద్ర చాంద్రీ ధయన్తికా చలచంచువౌ నను ని
స్తంద్రనయన దయార్ద్రత సాకుమ శ్రీలలితా! 5

సౌః కలిత షోడశాక్షరీ జపతపో నిష్ఠాగతాం
తఃకరణ యుక్తునికి భవనాశము ధథ్యమౌ న
ధఃకరింప నధోగతిఁ దాల్చు నుద్ధతుఁడు! తేన
మః! కృపాకరీ! సకలాగమ స్తుతా! శ్రీలలితా! 6

ఓం చిదానంద రూపిణీ! ఉన్మస్తకానుకంపా!
సంచితాగామి ప్రారబ్ధ సాంక్రామిక మహాపాప
సంచయ వినాశ మోజించి సంప్రీతి నన్ను నాద
రించి త్వత్సముఖమునఁ జేర్పించేవే! శ్రీలలితా! 7

హ్రీం శిఖామణీ! సంప్రదాయేశ్వరీ! సర్వాఘ వి
ధ్వంస మొడఁగూర్చి నన్ను గావంగ రావె మహిష నృ
శంస రాక్షస సంహార సంతోషిణీ! పూర్వజా!
కంస మృత్యుసందేశ వాగ్భాసినీ! శ్రీలలితా! 8

శ్రీం జపనిరత స్వాంత సంప్రీతా! సమస్త నైస్వ్య
భంజనా! నిరతిశయ శివప్రదా! నను నజ్ఞాన
పింజరపు పంజర ద్విజు విచ్చేలునిడి జ్ఞాన ప్ర
భంజనోచ్ఛ్వాసిగాఁ జేయఁ బ్రార్థింతు శ్రీలలితా! 9

కల్పనా రహితా! కలికల్మష నాశినీ! సం
కల్పమాత్ర సంసృష్ట లోకాలోక గిర్యంతరా
నల్ప మాయాజగ న్నేత్రి! అమృత ప్రదాయినీ! నీ
పాల్పడఁగ నంగలార్చు నన్ బాలింపు శ్రీలలితా! 10

ఏక భక్తిమదర్చితా! యీప్సితార్థ ప్రదాయినీ!
నీ కృపాతరంగిత వీక్ష నిరతము నిగుడించి నా
వౌ కసటులెల్లను సరింప నక్కటికముఁ జూపవే!
స్వీకరింపగదె నను ద్వద్భృత్యుని శ్రీలలితా! 11

ఈశతాండవ సాక్షిణీ! యీతిబాధోన్మూలినీ!
నాశపఱచి నాదు భవబంధములఁ జిదానంద ని
వేశనంబు ప్రసాదింపవే! త్రిభువన వీడితా!
ఈశి! ఐహికోశీ విరహితుఁ జేసి శ్రీలలితా! 12

లయకరీ! యపవర్గదా! రక్షాకరీ! శతాక్షీ!
నయన మాతృకృపాజల నవదిన వర్షధారా
క్షయిత వగ్రహా! వర్షిత స్తన్య! శాకంభరీ! వి
జయము నీకు దుర్గమ దైత్యసంహర్త్రి శ్రీలలితా! 13

హ్రీంకృతీ! వక్త్రలక్ష్మీ పరీవాహ మీనాభ శు
భంకర చలదక్షిద్వయీ! భైరవప్రియ వైష్ణవీ!
శాంకరీ! కంసరిపు పూర్వజా! యఘమర్దని! నా
కింకఁ ద్వత్కృపాప్తి యొదవు టెన్నఁడు శ్రీలలితా! 14

హరి విధీంద్ర సంసేవితా! హైయంగవీన స్వాంత!
హరికి హత్తించి హయశీర్ష మశ్వకంధ్య సురాధమ
మరణయుక్తిఁ బన్ని చతురామ్నాయముల్ రాబట్టితే!
హరిహరియును జ్ఞానానందుడై నిల్చె! శ్రీలలితా! 15

సవ్య మపసవ్య సరణుల్ ప్రశస్తములే యర్చించే
భవ్య నీకు! నవ్యాజ కృపాసమీచ! సచామర
సవ్య దక్షిణయుత పద్మజా పద్మజోద్ధార్చితా!
భావ్య మవ్యయ మిదుమమ్మ భావజ్ఞ! శ్రీలలితా! 16

కల్య! కామేశబద్ధ మాంగల్యసూత్ర గ్రీవ! కై
వల్య పదదాయినీ! దోష వర్జితా! మచ్చిత్త చాం
చల్య నిర్మూలన మ్మొనర్చఁగ రాదొకొ! యతుల్య! శాం
డిల్యదళ సంప్రియ ప్రియా! నిస్తుల! శ్రీలలితా! 17

హవ్యవాహనావిర్భూత! యవ్యాజ కరుణాస్వాంత!
భవ్య దివ్యమణిద్వీప వైభవ స్వామినీ! లో
కావ్యవహితాతివేల కృపామృతమయి! మాతృక
ర్తవ్య మిడగ నాకుఁ గరావలంబము శ్రీలలితా! 18

లక్ష్మి! దాక్షిణ్య చిన్మూర్తి! లంబోదర ప్రసవిత్రీ!
లక్ష్మణాగ్రజ పూజితా! లక్షణోజ్జ్వల దివ్యాంగి!
సూక్ష్మమున్ స్థూలమును ద్వద్వచోవిధి సంబద్ధమే!
పక్ష్మమక్షిఁ గాచే ప్రకృతిఁ బాలింపు శ్రీలలితా! 19

హ్రీంజప ప్రసన్నభావ! సాదృశ్యరహిత! నిత్య! ని
రంజనా! సర్వ కర్మఫల వివర్జనమొసంగవే!
వింజమాఁకిడిన తబిసి వెలది యచ్చేనవేలుపా!
శింజినీపద! నీరుజా సిద్ధిద! శ్రీలలితా! 20

సర్వ సంపత్ప్రదా! శివజ్ఞాన ప్రదాయినీ! దృ
క్సర్వ మంగళాకార! కృపాసాంద్ర! వాసుదేవ
పూర్వజా! వేల నీయరావో వేళ సంప్రాప్తింప
నిర్వృతి ప్రదానమొనర్చు నిర్భవ శ్రీలలితా! 21

కర కలిత విలసద్ధేమ కమలా! జపాసుమ భా
సుర! కదంబ వనస్థ! యస్తోక దురాచార సం
భరిత సంసార పాదప పాపవంకిల కుట్టన
కరఖరాసి త్వత్పద పరాగ విభూతి శ్రీలలితా! 22

లబ్ధ పాపమనోదూర! రక్షింపవె! దురితావ
ష్టబ్ధ ప్రాక్తన జన్మసంచయధురా పీడిత ప్రా
రబ్ధ దాహక జ్ఞానేషిర వరప్రసాదాత్త వి
శ్రబ్ధ జీవాత్ముఁ జేసి నన్ శర్వాణి! శ్రీలలితా! 23

హ్రీం పదాభిధా! హ్రీంమతీ! హ్రీంకార జప సుప్రీతా!
సంపరాయావకటవృత్తి సహిత్ృ సుప్రసవిత్ర్యాను
కంపనాజాన భువన విఖ్యాత! తాపత్రయపు
లంపటమ్మిఁకఁ బఱపు తరపఁగదె శ్రీలలితా! 24

సౌః పదారాధ్య! పాపప్రశమని! లౌకిక మగ్నతా
ధః పతితుఁడ నేనైతి! యధ్యాస తమోవృత మ
నః పరిస్పందనాకులు నన్ను నోమఁగ రావె వ
యఃపరిణతి పైఁబడె నీ దయార్థిని శ్రీలలితా! 25

ఐంద్రి యయ్యును త్వన్మహిమాతిశయ మెఱుంగమి
సంద్రవపుఁ గమరి కొమరిత! చేలుప నుంకించే ధూర్త
సాంద్రుఁడై విధాత్రస్త్రార్త సంతప్తుఁడయ్యెఁ! బొందె
నైంద్రి సంహర్త్రిషీకన్ నయనహాని! శ్రీలలితా! 26

క్లీం కలాత్మిక! సాధన క్లేశము లెడయించి యా
టంక విరహితోపాసకుఁడనయి శుద్ధపరాజ్ఞాన
సంకలిత సచ్చిదానంద సంప్రకాశుఁడనౌ వగ
జింక కనుకడల నెనరుఁ జిమ్మవో! శ్రీలలితా! 27

హ్రీం విభూషణా! హ్రీంజప ప్రీతమానస! మన్మన
స్సంవృతాసంవిదాంధ్య నాశముఁ గూర్చవే! సత్యాగ్ని
సంవిహిత హరికంఠోక్త సాహస్ర పరమనామ
సంవిధాన సంపూజన సంతృప్తా! శ్రీలలితా! 28

శ్రీం! పరా వరాక్షర షోడశీ బీజ! ఆముష్మిక
సంపదన్ దయసేయవో నాకు శ్వశ్రేయస ప్రదాత్రీ!
లొంప యయ్యె మన్మనము గలుష రాగవిద్వేష భా
వంపు దుర్గుణములకు! నీవ శరణు శ్రీలలితా! 29

తే నమః! మాతరో! భవదీయ భక్తులఁ గడగొ
ట్టేను! పసివానిఁ బ్రేముడి నెక్కుడు సేసి యైపుల్
వాని వెల్ల నుపేక్షించి వాత్సల్య ముంచు మాతృ
మానసంబునం గాచుమమ్మా నన్ను! శ్రీలలితా! 30

అడవి మానిసులే కాని యసలు తెల్విఁ గలవార
లెడఁదలోన నిన్ను నిలిపి యియ్యకొనెద రచ్చనల్
మడి తడి యటంచు మేము నేమములెన్నొ పాటింతుమై
కడకునూకక గుండియ కొడుదు శ్రీలలితా! 31

తపముఁ జేయంగ నింటను దారసుతాసుతులున్
దపమొనర్ప వనిఁ జన శతధృతిచే మేనకాదుల్
చపలమతి నొనర్తురు గద! చేవొచ్చి పడె నమ్మరో!
కృపను మన్నించి నన్నుద్ధరించేవె శ్రీలలితా! 32

ఏడుగురవు నక్కలఁ గూడి యిష్టకామేశ్వరి! మా
తోడునీడ వేడుగడవు దొగసామి సిగతొడవ!
పీడలం బాపి మాఇంటి వేల్పు! వైష్ణవి! నీ యడ్గు
చూడికి సమకూర్పఁగదమ్మ సుజలాంఘ్రి! శ్రీలలితా! 33

ఐహికమన స్వాంతమున రోయఁగనేల వేదాంతుల
నాహతాబ్జ నివాస! క్షరాక్షరాత్మిక! సదవ
గాహనమున దాని నెఱుఁగంగ నది బీజాక్షర సం
దోహమే! సుపాలనమిడదో ముక్తి శ్రీలలితా! 34

అసలుపుట్టువ యాకుపై నంటని నీటిచుక్క
పసను విడిమట్టు తామరపాకుపై నెదనుంతు, దా
ని సడలించి చేరఁగవైతు నీ తమ్మిపూ టడ్గులఁ
బొసఁగ నంటియుంచుమ జాటిపోనీక! శ్రీ లలితా! 35

మఱ్ఱియాకు డోల న్నను మనుప మాధవుఁడనో! నీ
కుఱ్ఱ నీదుచేనుంటి నా కొలఁది సత్తువ కొలఁది
వెఱ్ఱినౌచే నీ సంసార విషధి! చేయఁగదె విధి
వఱ్ఱు నాయీత కౌనటుల్ వాటము శ్రీలలితా! 36

తమ్మిపూల్వోలు భావవైదగ్ధ్య సంభరిత కవి
త్వమ్ము నించిన పద్యపుష్పసమర్చఁ జేయ నా శ
క్యమ్మె! నీ పదమ్ములె స్వయమ్మబ్జముల్! నావి యయ్యుం
దుమ్మి పూల్కైతలవి కూర్మితోఁ గొను శ్రీలలితా! 37

త్వక్స్థ! ఫాలస్థేంద్ర ధనుఃప్రభా! భవరుజ్నాశినీ!
ఋక్స్థ! నిగమాంత సంవేద్య! కృత్స్నవేత్త్రీ! పరా! ప్ర
త్యక్స్థిర ప్రదాయిని! సర్వదా నా కిడంగదె మ
ద్వాక్స్థితవయి త్వన్నుతిఁ గొల్పు భాగ్యమ్ము శ్రీలలితా! 38

కండ బల్మినిఁ గైకొని కానలందుఁ దిరుగాడు
చేండు నీయెక్కుడును బట్టియుంతుము పంజేరాన!
గుండె పంజేరమ్మున నిను గుదివెట్టి కొల్వ బత్తి
దండితనము గాక మఱొక దారున్నె! శ్రీలలితా! 39

కడను వెన్నొదవిన యించేకాఁడ నా బ్రతుకయ్యె! నీ
కడఁ గలదెడంద పొడ తుంటకాఁడ తీపి సొన తోడ!
కుడుప నాకొక్క చేక్కైనఁ గూల్చివేయుం గదా నా
యెడఁద గఱకొన్న నింపిరి నెల్లది శ్రీలలితా! 40

లెక్క చేయక యుంటి వాలింప కుంటివి మనవుల్
మ్రొక్కినను వరమీని వేల్పును విడువంగావలె
గ్రక్కున నని సుమతి శతక కవి వాక్రుచ్చిన న్నీ
తక్క మఱువేల్పు వేరేది తర్కించె శ్రీలలితా! 41

పంచేదార పలుకులు నీ పరమభక్తాగ్రగణ్యు
లెంచేగ, నను భవత్కృపామృత వరస్నాతుని గా
వించి యీ యుసుక రవ నవ్విధిఁ జేసి కలకండ నీ
యంచేఁ జేర్చ రాదొకొ వారి యనువున శ్రీలలితా! 42

చిలువ తాలుపు కలికి, పెంజిలువ పానుపు వేలుపు
పొలతి, బొడ్డు తమ్మియలరు పుట్టువ మడతులకుం
దొలుదొలుతటి యమ్మ! కరుగదో మది! వేడుచేంటి
నెలమిని జిలుకుమా నాపయి నొకింత శ్రీలలితా! 43

ఎంత దురపిల్లినను జూప వెక్కటికమ్మ! కికు
రింతఁ జేయఁగ నేనె దొరికితినో! చూచేఁ జెవు
లింత నిగుడించేచేఁ దొడుకులెన్నొ నన్గాని! నిచ్చె
గింతునే! తొత్తటికము ముగింతునే ! శ్రీలలితా! 44

నైక కోట్యజాండైక ప్రభ్వీ! ఏదొ యొక యీమూల
నీకయి వనరుచేండఁగ నేనెఱు కెట్టులవు
నీ కనకు! వినరాదొ దవ్వెంతైన యంబా యను
కేక గోమాతకుం గ్రేపు ఖేదించే శ్రీలలితా! 45

పూర్వజులనిరే కద “స్వభావో దురతిక్రమః!” నే
నిర్వికల్ప సమాధి సంధించే భ్రూకుటి దృష్టినిన్!
పర్విడుచేనుండుఁ జేతము వల్లటిల్లుచు! నింకెట్లు
నిర్వహించెదఁ! గుదురీవె నేర్పవె! శ్రీలలితా! 46

మాడు పైనఁ జేండొక్కటి మాయదెంత కడిగినన్
బోడిఁ జేసినన్! బ్రవచనముల్ విన నెన్నియైన
మాడు లోని కౌటిల్యము మాయదే తీరున! నే
డేడు జగముల యమ్మ నీవే మాపు శ్రీలలితా! 47

తల్పుగా నైహికమిడఁగఁ దల్లీ నిను నదియౌను
వేల్పుచెట్టును దాకొని వేడుటల్ పలుగఱను!
కొల్పెదవా లేదా యట్లుంచి కోరగానేల కచ్చు
లల్పముల్ సదాగతిఁ గాక! అందీవె శ్రీలలితా! 48

భండ పుత్త్రవధోద్యుక్త బాలా పరాక్రమ ప్ర
చండ సంప్రదర్శన ప్రహృష్టమతీ! ప్రసాదించే నీ
యండ మన్మనోభండగుణారిషట్కవిజయి నీ
కొండొక న్నేను గాఁబోనొకో యమ్మ! శ్రీలలితా! 49

వస్తుతః కాను దుర్మార్గ వర్తనుండఁ! గలిలోఁ బ్ర
శస్తమామాత్రమున్నచో సద్వర్తనుండనే! త్వ
న్నిస్తులానుషంగాపాస్తునిం జేయకు మహీనపు
ప్రస్తుతార్థము శ్రేష్ఠమన్ పద్ధతి ! శ్రీలలితా! 50

భానుమండల మధ్యగా! వహ్నిమండలవాసినీ!
మానసాంతర శూక సూక్ష్మతమసజ్జ్యోతీరూప!
పూని జ్యోతిష్మతీయోగము నిజాస్మితమనోవృత్తి
జ్ఞానమెప్పుడందుదునొ తేజస్వినీ! శ్రీలలితా! 51

చేఁప పూపలున్నవి నీకుఁ జిలికింప నెలమి మాపైఁ
గాఁపిడంగ నున్నవి కద కై తూడు లీకు నిచ్చేల్!
పూప తమ్మి పూయజ్జలు వూనియుంటివి కదమ్మ
మోపి మా తల వాటికి మ్రొక్కఁగ శ్రీలలితా! 52

బోడిఁ గాన్గాని నీతోడ ముడివెట్టుకొని యుంటి నా
తోడుగా నిల్తువం చొక్కతూరి నన్బరికించి నా
గోడు వినవె యమ్మరొ కులకుండలినీ! చెప్పవే
సోడు నెప్డు తెరతువొ పైఁ జొత్తెంచి శ్రీలలితా! 53

ద్విజుఁడనే కాని కాకుంటి విప్రుఁడ! నెత్తి బ్రాహ్మ
ణజను వైతి బ్రాహ్మణ బ్రువుండ! నిపుడు స్వాధ్యాయము
ను జేరుపు వయసు మీఱె! ననుగ్రహింపం దగునా
కుఁ జిదయనచారము కరుణాకూపార శ్రీలలితా! 54

లోక యాత్రా విధాయినీ! శ్రుత్యంత వేద్య! మాయ
పోకడలు నీవి యెఱిఁగెడు పోడిమి మా పిచ్చిమా
లోకములకుం గలదొకొ! యెట్లో యేదొ చూచాయగా
మాకుఁ దట్టెఁగా నిన్నిజన్మలు వోవ శ్రీలలితా! 55

మాయదారి జన్మంబిచ్చి మహికి భారము సేసితి
వీ యలుపుని! నికంజేలు నీబ్రతు కీపై నన్ను
మోయు బాధ నీ యవనికిం బోఁబెట్ట లాగుకోవ
మ్మో యనఘ నను నీలోని కొఱపుగ శ్రీలలితా! 56

తాడుతో గుంజేకుం గట్టి తన పని జేసికొంచే
గోడు వెట్టగఁ బసికూనకున్ విడుదలఁ గూర్చి ము
ద్దాడి యమ్మయే లాలింపదా! అటు విడుపన్నీకుఁ
బాడి గాదొకో నాకర్మపాశము! శ్రీలలితా! 57

కన్నులున్నవి వేల్వేలు గద! నీ కనులఁ బడక
యున్నె యేయొక్క ప్రాణియు నుర్విఁ బైఁగ్రిందుల! న
చ్చిన్న పర్యవేక్షణమును జేతువయ్యును మృగాక్షి
చెన్ను! వేఁగుచే న్నానింతఁ జేఁదవొ శ్రీలలితా! 58

నిన్ను గొండాడని నరుఁడు నిజేము నక్రసదృశుండు
నిన్ను గీర్తించేఁగా వినని నరుఁ డురగసముండు!
కన్నులార నీమంగళకరమూర్తిఁ గాంచేనట్టి
యన్నరుఁడు గురుపతి కన్న నంధుడే శ్రీలలితా! 59

ఆకతాయి యైనను నమ్మ అనునయించేదె సంతునున్
బోకలన్ సవరించి సముచిత పథానఁ జనఁ బ్ర
త్యేక దృష్టిం బరపదె! తల్లీ! మడియించి మత్పు
రాకృతాఘముల్ పరముఁ గూర్పంగదే శ్రీలలితా! 60

కొంచెపున్ గుండె నాయది! కొండంత వెల్గువు కుం
చించేకొంటివి నిన్నీవు చిరుదివ్వెయై యందుండఁ!
గాంచేఁగ నిడుమమ్మరొ నాకు జ్ఞానసులోచనముల్
సంచితతత్వద్దయామృతుం జెల్పి నన్ శ్రీలలితా! 61

సూదితో శృంగినిం దొల్చు చొప్పు త్వదురు విభూతి
వేదవేద్యుల కైనఁ దివిరి విశదపఱచేఁగాఁ!
గాఁ దగునె నా తలకు నెక్కఁగా నిసుమంతైన! ని
రాదరించేక నిల్పుమీ యజ్ఞుని శ్రీలలితా! 62

ఇచ్చితి విదేమిపుట్టు విదేమొ నాకొక యింతయు
నచ్చి రాలేదె తల్లి! మహానిద్ర నిమ్మిక నా
యుచ్చి విచ్చి తజ్జీవాత్మఁ డుద్గతుఁడయి యఖండ
సచ్చిదానంద సంప్రాప్తి సమకొనన్ శ్రీలలితా! 63

వ్యాస శాపకర్త్రీ! వజ్ర భైషిగ హస్త! గోప్త్రీ!
వీసమేనియును శమము వీనిలో మృగ్యమంచేం
ద్రోసి వేయకుమమ్మ నను! బకవేష యయుచారి
గా సవతుసేయ కిమ్ము సద్గతి నెంచి శ్రీలలితా! 64

భవమె విభవమ్ము నెంచి యభవురాణి! నీ యీా సుతుం
డవధరించేక నిగమోక్తులాచరించేక నిగమాం
తవచనంబు లీలవిడచి తారుచేండగ నీకయ్యె
నొ వహియింపగా హ్రీం! క్షమింతువుగదె! శ్రీలలితా! 65

ఎన్ని కూహలఁ జేసితి నెన్ని దుర్వాక్కు లంటి
నెన్ని దుండగాల్సలిపితి నెన్నెన్నియొ! నీకు నా
సన్న మొగమెట్లు చూపింతు సాకారపూజ సేయఁ!
బన్నుదు న్నిరాకారార్చ భావాన శ్రీలలితా! 66

సొదను బదడగు సేపాయె సొద విన వసదున్! మొఱ
రొదఁ దలంచి పాలార్చి బిరుసుమది వైతివో! నీ
కది వలనగునొ! చెవియొగ్గవమ్మ వెడ! అమ్మతన
మ్మది యనంబడునే బిడ్డ నెన్నక! శ్రీలలితా! 67

చిన్న పెద్ద గోదాట్రెండు సేరి కట్టెరనున్ మేన
నున్నవియ కాని యొంటికి నొకటి పొందిక లేమితోఁ
గన్నడించితినేమొ నీ కాళ్ళఁ బట్టు నెటి నేర్వ
కిన్నినాళ్ళుఁ జేకొనవొ మన్నించి నన్ శ్రీలలితా 68

ఎల్లియొ మఱెల్లుండియొ యేఁగకీ జీవుఁడు దా
నెల్లి కిలఁ దప్పునే యసుభృత్తులకు! నఘంబులు
జేల్లి యగునే చేలిపినవి! జేముని జెవిన్వేయుమా
యెల్ల యగవుల కొఱను నీ కిడినది శ్రీలలితా! 69
(కరోమి యద్యత్....సమర్పయామి)

నామరూప వివర్జితా! నామసాహస్ర స్తుతా!
పామరుండ! నిన్నేరీతిఁబట్టుకొనందగు! ని
ష్కామమో సకామంబొ? మోక్షపరాయణత నాది యిం
దేమవునొ? చేయుమీ దయ నేర్పడ శ్రీలలితా! 70

మహిజఁ బట్ట విరాధుఁడు మహిలోనఁ బూడికయ్యె!
మహిజఁ బట్టి దశాస్యుఁడు మహిపైన మాడిపోయె!
మహిళలం బట్టి కామించే మన్ను గాఁగ మనుజుల్
మహిమఁ జూపు కలి మహిషమర్దనీ! శ్రీలలితా! 71

వేయి యంచేల గుడుసున వేచియుండెఁ బతి పైని
నీ యడుగు నాదరవున నీవేమొ యుంటివి కూర్కిడి!
నాయనకు నమ్మకు నడినుంట కొడిమె యది నాకేల!
పోయి వడిగ నీ పెన్మిటిఁ బొందవో శ్రీలలితా! 72

అరయ నేగూఁటి చిల్క తానా గూఁటి పల్కాడు నం
దు రిహమున ననర్థవ్యర్థ దుర్వాగ్విలోలత నా
దు రసన యపవిత్రంబయ్యెఁ! దూరనీ నీ గూఁడు నె
నరున బూతమౌ నాడి నీ నామమే శ్రీలలితా! 73

అరతి యైహిక లాంపట్య మందెసంగె నపవర్గ
నిరతి సంధిల్లె చిన్మోదనిరతిశయానంద సం
భరితుడం గాఁగ జేపెట్టుమ పశుపాశ విమోచనీ!
పరము గాకేల నా కితః పరమిఁక శ్రీలిలితా! 74

రాఁ బిలిచితి నెన్నోమార్లు ప్రతికార్యమున్! విచ్చేయ
గాఁ బడకయుండెనో వీలు గాక పనిన్! రాలేమి
నీ బదులుగ నీ పతినైన నీ బాలనైన నుత్తి
గాఁ బనుపరాదొ! వాడుకం గైకోలె! శ్రీలలితా! 75

చిక్కినట్లె చిక్కి యెడద చిట్టాడునంతలోనె
నిక్క దొక్క నిమేషమున్ దృష్టి భ్రూమధ్రువంబులన్
బక్కవాడనే యమ్మ నీ వాన్కిఁ దెఱకువచూడ్కి
నెక్కొనంజేయవే వైళము నిర్భవ! శ్రీలలితా! 76

సత్పురుషులకే వచ్చుఁ గష్టములందురా లోకోక్తి
మత్పరం బన్వయించే కొమ్మందువో! యౌదునేమొ
సత్పురుషుఁడఁ బడసితిఁ గష్టములెన్నొ! మఱి నాదు సత్
తత్పరత త్వత్కృపాప్త పాత్రము గాదొ? శ్రీలలితా! 77

అది స్వయంకృతమో యరయం బురాకృతమో యేమొ
యెొదఁగక నొక గాడి నడుచేచేన్నదీ బ్రతుకు బండి
ఇది పరాకృతమని మదినెంతునిఁక! నిషంగధీ!
సదయఁ జేర్చవొ శ్వశ్శ్రేయసస్థలిన్ శ్రీలలితా! 78

కృతకృషి కనురూప ఫలము గిట్టుబాటొందక జీ
వితము గడిసిలె లౌకిక విషయాల! మజ్జాతకం
బు తెలియని దానవో యెల్లఁ! బోరచి కానీకు నీ
మతము నా చేసిన తపమమ్మరొ యట్లు శ్రీలలితా! 79

సోహమని వెలిఁ బ్రవచించేచేంటినే కాని లోలో
నా హృదిం బాదుకొనకున్కి జ్ఞానము గూరునే! ఈ
దేహ జీవాత్మ హంసగాఁ దీరి యద్వైతసుధా
వాహిని నసివాఱు గొను గృపంజూపు శ్రీలలితా! 80

జనుల దండిగఁ బుట్టించి సరిపెంపకమ్ముఁ గూర్పఁ
గ నది యెంతొ కష్టతర మా కతనను నయ్యె నా పె
న్పున గడబిడట్లు నీకుఁ గాబోలు! నా మూలదేశ
మునకు నన్పంపవే! భారము సడలు ! శ్రీలలితా! 81

నొసట కన్నున్న వానికిం దూఁగుదం చేడుగు కన్ద
బిసి నెగడి రొమ్ము పైఁ దాఁచే వేల్గంటి చిదిమెదాని!
నొసఁగఁగ నెఱుక కన్నల్పు లోపఁగాఁ జొలరు మా
నిసు లటంచెంచి యీయకుంటివొ మాకు శ్రీలలితా! 82

అరయ స్వర్గాపవర్గములందుఁ బరంబు బహ్వ
క్షరయుతము గాన నిమ్ము నిశ్చయముగ నద్దానినే
వరము! స్వర్గాపవర్గదా! స్వల్పమేల కయికొనన్!
బెరికి నొడఁబడం జూచితే పిల్లలన్ శ్రీలలితా! 83

చిన్ననాట నీ గుడిముందుఁ జేరి యాడితి జొఱుళ్ళ
నున్ననౌ వాలుబండలందు వినోదముగ! జొఱిన
నన్నిమార్లు పైకెక్కితి హాయిగ! బ్రతుకుబండన్
బన్నసై జొఱి లేకుంటిఁ బట్టీవె శ్రీలలితా! 84

నిత్య యౌవనా! మదశాలినీ! మాసినవి మదము
లత్యయుఁడ! ముదిన్! సైరించుమమ్మ! కైవల్యానంద
ప్రత్యగాత్మఁ జేయఁగదే పరాశక్తి! నన్ను, నేఁ ద
న్నిత్యమున్మదమంది నందించేఁగ శ్రీలలితా! 85

క్షణమొక విధాన బ్రతుకును సాగఁజేయుదువు! సుఖం
బనగ దుఃఖంపు లేమియే యగుటఁ గాకొండున్నదొ
కొ? నిజమెఱుఁగని వెఱ్ఱిబాగులు జీవుఁ డాజన్మాంత
ము నిజతత్త్వమరయఁడు ముమ్మొటొచే శ్రీలలితా! 86

జరఠుఁడయ్యె వీఁడైనను జ్ఞానమ్ము వీసమ్మైన
బెరయ లేదక్కటంచు నీ వృద్ధు నన్నుంగూర్చి వ
నరకు మమ్మ! మీ దేవమానమ్మున శిశువు పాటి
నరయ! సంవిత్తునుగ్గుఁ బోయవె కొని శ్రీలలితా! 87

పనుచే మా త్రిమూర్తుల నొకపరి దర్శనంబీయ న
ప్పనము సేసివైచెదను లోపలి తిగగొనములఁ ద
గిన యటు లెవరి యవి వారికిన్! దదుపరి కొనంగ
నను సుగమమౌఁ గదా నీకనాద్యంత! శ్రీలలితా! 88

చేదివితిం బురాణములు! విచారించితిన్ వేదకో
విదుల! వింటి నత్యంతము వేదాంత విశ్లేషకు
ల దరి దూరి! యా యా తేనెలన్మునిగిన యీఁగనై
తిఁ దగఁ దేనీఁగఁ గాక పోతినె కదా శ్రీలలితా! 89

సామగానప్రియా! శివ సామరస్య పరాయణా!
సామి సామేని గఱిత! త్వత్సదృశ సుదంపతిని
మేము ముజ్జగానఁ గనలేమే కదా! భావైక్యము
లేమి దేహైక్య మెట్లు వర్ధిల్లెడున్ శ్రీ లలితా! 90

ఇదియొక నికాయమేనని యెదనెంచితినె కాని పై
నది నికాయ నికాయమటన్న స్ఫురణ మేర్పడఁ
గుదురకుండనె యీ బ్రతుకున్ వెళ్ళమార్చితిఁగా
నదవద వడఁ దుదినిఁక నయంబేమి శ్రీలలితా! 91

పుట్టు గ్రుడ్డి మోహాంధు డేపున్నె మొనర్చెనో ముం
బుట్టులం! గనె నిజరూపమునఁ బరమాత్మఁ గాని
వట్టిపాటయ్యెఁ గద దయావర మాతని యెడల! నా
కట్టి చూపీయవో! కన్నులవి యిచ్చితివి మున్నె కాఁ
బట్టి యొక్కరూపముఁ జూపు పని చాలె శ్రీలలితా! 92

గొంతి పెదకొడుకు వేల్పుల కొంపకేఁగియు బొందితో
నంతయుఁ దగుల మెడలడు సొద రౌలని కతన!
నెంత గట్టిగ మమకారమీ మేని నరనరానఁ
గుంతుకొను నీ యహమ్మతిఁ గోల్పుచ్చు శ్రీలలితా! 93

మొప్పె నైతిఁ బూర్వార్ష ప్రబోధపథంబున నే
నొప్పి చరియించే నైతినయో! యైహికఁపు నూతిలోఁ
గప్పనై జన్మ మరణచక్రమునఁ దగిలి నలుగు
ముప్పెఱుఁగనైతి! గతి నాకిపుడు నీవ శ్రీలలితా! 94

అవ్వలి దెస తోతెంచేని యమృతాంశు బింబమునా
మవ్వపుం ద్వదీయ ముఖసమ్యక్కళాధరదర్శనం
బెవ్విధి దయసేయుదొ చెప్పవే తల్లి! సుతునిమ్రోల
నవ్వ మొగమడకునొకొ కులాంగన! శ్రీలలితా! 95

(అవ్వ=అమ్మ)
[అవ్వలి దెస తోతెంచని యమృతాంశు బింబము=Blind side of the moon. (మనకప్పుడూ కనపడని చంద్రుని వెనుక భాగము) Blind side of the moon is beautiful అని సామెత. ]

రామ రామ రామ యని యార్తజనాళి ముమ్మారనం
దాము గొందురట సహస్రనామ పారాయణ ఫ
లామృతంబునా రామ నీవంచు నేనెంచెద రా
మా! మదిన్! సత్యసంధ! జన్మవిరామ! శ్రీలలితా! 96

వేల్పుగిడ్డి పొల్పెసఁగఁ బ్రాప్తించే నీయండ యేల
తల్పుఁగా నా కజాగళ స్తనచూషణాయాసముల్
కల్పతరువు సవురు నిను గాదని జేరఁ బటు
కల్పశాఖి నీడేల సంకల్పించే శ్రీలలితా! 97

చేతులారంగ నిన్ను బూజించుచుంటిఁగదే తల్లి!
చేతమారంగ ధ్యానమ్ము చేయుచుంటిఁగదే మాత!
మూతి నొవ్వంగ నీమాయఁ బొగడుచుంటిఁగదే! నను
నీ తనయుఁ జిన్నఁబుచ్చేకింకేలుమీ శ్రీలలితా! 98

ఘోరతపముచేఁ గైకసి కొడుకందె గొప్పశక్తు
లా రఘూద్వహుండేతప మాచరించి దశాస్యునిఁ
బోరునన్ నొంచు లావును బొందనయ్యెఁ? దన ధర్మా
చారమే కదా ఘన తపశ్చర్యయౌ శ్రీలలితా! 99

కామితార్థప్రదా! మహాకామేశ మహిషీ! నాకిఁ
కేమి కావలె? నున్నదొకే కోర్కె! యెఱుఁకయ్యె! నా
కా మణిద్వీప సంవాసమందు మక్కువ పెక్కయ్యె !
నా మనోరథంబును నెక్కొనంజేల్పు శ్రీలలితా! 100

'మమ' మనోవృత్తి నిర్జించే మల్లుడఁ గానైతిఁ! గా
ని మమ భావమిప్పుడు నిల్చె నీయంద! నాయెడ నీ
కు మఱి యయ్యె దేనాటికి గోరంత యైనఁబుట్టు
నొ? మమతా హంత్రి సదయ నన్నోమఁగ శ్రీలలితా! 101

కామమైహిక మిప్పుడు గతియించెఁ బరమ పద
కామినై కుమారిలుచుంటిఁ గర్తవ్యము భవచ్చర
ణామల సరోజ సంసేవనాచరణ మెఱింగితి!
భ్రామరీ! కృతకృత్యుఁ జేల్పవె నను శ్రీలలితా! 102

నాల్గిటింగల దారిటిన్గలదు చిత్రం బాశంక
కల్గుఁ దార్తీయ పురుషార్థకమ్మెట్లు బరిచేక్కునున్
బాల్గొనంగనయ్యెఁ బ్రథమంబై! వినాధర్మార్థము
ఫల్గువై ప్రతీపమవు సంభావమొ శ్రీలలితా! 103

అయిదగవులకేలముపట్టి! ఆనుపానులు నీవి తె
లియఁగ తీరూపులకునైన లేదు నలువగునే నా
యయితి! యెఱిఁగిపట్టితిలె నీయజ్ఞ దంటను మనుప
ని! యిఁకఁ విద్యఁ బుట్టువిడుపందించేక శ్రీలలితా! 104

పెద్ద పొత్తమునొకదాని పెట్టుక ప్రొద్దుపట్టి
వద్ద ప్రొద్దంత జీవుల పాపకర్మముల పద్దు
బుద్ధిగా విన్పు చిత్రగుప్తుడు వినఁ జెప్పు నే ము
ప్పొద్దు వెలిగించితి దివె నీప్రోలంచు శ్రీలలితా! 105

(త్రాహిమాం నరకాద్ఘోరాద్దివ్యజ్యోతి ర్నమోస్తుతే)

చక్రయంత్రము లైహిక స్ఫూతిఁ జేకూర్పఁగ శ్రీ
చక్రయంత్ర మాముష్మిక స్ఫూతి సిద్ధింపఁజేయుఁ!
జక్ర షట్కముఁ దరియించి సప్తమ చక్రంబును
సక్రమముగఁ గూడంజేయ శక్తి కుండలినిని హే
వక్రతుండాల్ల! మేల్కొలుపంగదె శ్రీలలితా! 106

నాటితిఁ బదాఱు విత్తులు నా యీ యెడంద యెల
తోట నెన్నఁడో! మొల్చి పంతుగఁ గాఁత నీవలె నీ
పాటికే! కిసుకం గొదవ బడెనేమొ యొకింత! నే
కాటికిం జేరు హదనాయె కామేశ్వరీ! యింక నీ
వీటికిన్ నన్ను గొంపోవవే తల్లి శ్రీలలితా! 107

ఆ ఋషిన్ యామ్యుఁ దెలతు నన్వర్ధ్యకైవల్య దాయ
కోరు దశశతనామ సముద్భవ కారకున్! మా
నీరువామి, కొండలయంత నెఱపిన పాపాలింకు,
తాఱు, దారిఁజూపెఁగద నీ దయ నంద శ్రీలలితా! 108

## సమాప్తి ప్రార్థన

తీపి యక్కరములఁ గొన్ని దీర్చి మదభ్యర్థనన్
దీపి యక్కరల నిమిడ్చితి నిటులనో శ్రీ లలి
తా పరామాత!మోక్ష సంధాత్రి! వేడ్కొను వఱకే
నా పని! తగ నేలుకొనఁగా నన్నిఁక నీ పనియే!

-- :: సమాప్తం :: --

## శ్రీమాతృ ప్రణిధి!

శ్రీకరీ! నమ శ్శ్రీచక్ర చిద్బిందు సంవాసినీ!
నాక హరివిధీంద్రహర ప్రణామపణాయితా! యీ
వే కదమ్మ శ్రీవాక్కాళ్యవేలశక్త్యాత్మిక! చె
వ్వాకులఁ దపనోద్వధిపులనాడించు శ్రీలలితా! 1

వృద్ధునైతినే కాని తల్లీ వయఃపరిమాణ సం
బద్ధ తనులక్షణమ్ముగఁ బక్వంబు గాలే దస్మ
ద్బుద్ధి యింతదన్క! నిఁక విడ్పుంబొందఁగా నైతియే
త్వద్దయామృతలబ్ధి చేతంగాక శ్రీలలితా! 2

భక్తి తక్కముక్తిత్రయ పథమేది యేనెర్గ న
శక్తుఁడన్ భక్తిమత్కల్పశాఖీ! ప్రదీపించి వి
ధ్యుక్త మీపశునిన్ పాశ దూరునిఁ గావించి ప్ర
త్యక్తథాత్వ సంజ్ఞాన మీయఁగదమ్మ శ్రీలలితా! 3

నిర్ణయింపు మిఁకనయిన! నేనెన్ని పుట్లీ యాజ
వార్ణవ మీ్మదఁగవలె! నీ ద్వీపమ్మునకు నెపుడు
తీర్ణుఁడనయి చేరంగల్గుదే! జీవవేదనేష్టిం
బూర్ణభావాహుతింజేయు మూర్తము శ్రీలలితా! 4

పంచకృత్య పరాయణ! భానుమండలమధ్యస్థ!
ప్రాంచితభ్రూ! భవత్పద్సమీపసంస్థితిభాగ్యమున్
గించిదభ్యుపపత్తి నూని ప్రదానమొనరించి త
ప్పించవే త్రిమూర్తులకు నా వ్రేగును శ్రీ లలితా! 5

అనుపమార్త దయాసుధానూప భరిత నయనా!
అను(గుబొట్టె( బ్రోవ నను బొట్టైన నొందు విద్రుపగా
ననువుగా( దల్పకుంటివో! యవిరత శ్రుతిఘోష నా
మనవి నిన్విన నిచ్చెనే మాతరో! శ్రీలలితా! 6

కంటగింపుగా నెంచేక కల్మష కర్మ(డంచు(
గంటి కింపగు నీ రూపు( గాన్పింప( జేయుమా! ని
న్నంటి యుంటి( గాదో వేల్పుగా నిన్నినాళ్ళ నుండి
యింట( బెట్టుకొని యఘము లీ(గ(గా శ్రీలలితా! 7

కడపక కొలుచేచేంటి నా కలుచేల నెల్లనీవు
కడపుదువని! భక్తుని కోర్కి కడపకయుంట నిన్ బో
లొడయురాలీ ముజ్జగముల కొమ్మనే! అమ్మరో న
న్నొడ(బడి కడకంటం జూచి యోముమీ శ్రీలలితా! 8

నీవ సంకల్పము మతి( జొన్పి ప్రచోదనమొనర్చి నన్
దావకీన పద్యగళ శతదళార్చకుం జేసితే!
కావలసినవా(డుం గాడొ కవితాప్రసాదు నీకు!
నీ విముఖత వీడి కొనుమ నీ చేర్వ శ్రీలలితా! 9

(రాజమహేంద్రవరము నుంచి శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యం గారి సంపాదకత్వంతో వెలువడే గోదావరి ప్రభ (ఏప్రిల్-జూన్ 2023) లో ప్రచురితము)

# కొన్ని పదార్థాలు

| పద్యం | పదం | అర్థం |
|---|---|---|
| 20 | వింజమాకిడిన | |
| | తబిసి | అగస్త్యుడు |
| 22 | వేల | అనాయాస |
| | | మరణము |
| 24 | పఱపు | వేగము |
| 26 | కమరి | మేఖల |
| 27 | వగ | రీతి |
| 28 | సత్యాగ్ని | అగస్త్యుడు |
| 29 | లొంప | కొంప(ఇల్లు) |
| 30 | ఐపు(అయిపు) | తప్పు |
| 31 | కడకునూకు | ఆవలకు |
| | | త్రోయు |
| | కొడు | కాపత్యము |
| 33 | చూడికి | దర్శనము |
| 35 | పస | నేర్పు (విధము) |
| | విడిమట్టు | సంసారము |
| | | (కుటుంబము) |
| 36 | వఱ్ఱు | ప్రవాహము |
| 39 | ఎక్కుడు | వాహనము |
| | గుదివెట్టు | బంధించు |
| 40 | ఇంచుకాడ | చెఱకు గడ |
| | తుంటకాడ | చెఱకు గడ |
| | నింపిరి | మలినము |
| | ఎల్లది | సర్వము |
| | గఱికొన్న | కరడుకట్టిన |
| 44 | ఎక్కటికము | దయ |

| పద్యం | పదం | అర్థం |
|---|---|---|
| | కికురింత | వంచన |
| | తొడుకు | ఆవు |
| 48 | పలుగఱ | దంతకాష్ఠము |
| | కచ్చు | కోరిక |
| | సదాగతి | ముక్తి |
| 49 | కొండొక | కుఱ్ఱడు |
| 52 | పూప(1) | కంటిపాప |
| | పూప(2) | లేత |
| 53 | సోడు | బ్రహ్మరంధ్రము |
| 59 | కొండాడు | స్తుతించు |
| 62 | నిల్పు | రక్షించు |
| 63 | ఉచ్చి | బ్రహ్మరంధ్రము |
| 64 | వజ్రభైషిగ | కాశీ అన్నపూర్ణ |
| | | చేతిలోని వడ్డించు |
| | | గరిఁటె |
| | యయు | మోక్షమార్గము |
| | సవతుసేయు | సరిపోల్చు |
| 65 | ఈల, హ్రీ | సిగ్గు |
| 66 | సన్న | అల్పమైన, |
| | | దుఃఖితమైన |
| 67 | సొద | చితి |
| | పదడు | బూడిద |
| | సేపు | వేళ, కాలము |
| | అసదు | దీనుడు |
| | పాలార్చు | ఉపేక్షించు |
| | వలనగు | తగు |

| పద్యం | పదం | అర్థం |
|---|---|---|
| 67 | వెడ | ఇంచుక |
| 68 | గోదము | మెదడు |
| | కట్టెర | కపాలము |
| | కన్నడించి | ఉపేక్షించి |
| | నెఱి | విధము |
| 69 | ఎల్లి(1) | రేపు |
| | ఎల్లి | మరణానంతరము |
| | జేల్లి | అసత్యము |
| | అగవు | కార్యము |
| | కొఱ | ప్రయోజనము |
| 72 | వేయియంచేల | |
| | గుడుసు | సహస్రారచక్రము |
| | అడుగునాదరువు | మూలాధారము |
| | కూర్కిడి | నిద్రించి |
| | కొడిమె | పాపము |
| 74 | జేపెట్టు | దీవించు |
| 75 | ఉత్తి | ప్రతినిధి |
| | కైకోలు | అంగీకారము |
| 76 | చిట్టాడు | చలించు |
| | తెఱకువ | వివేకము |
| 79 | గడిసిలు | క్రుంగు |
| | పోరచి | వ్యర్థము |
| 80 | అసివాఱు | విహారము |
| 81 | పెన్పు | పెంచుట |
| 83 | బెరికి | తక్కువ, న్యూనము |
| 86 | ముమ్మోటు | మూర్ధాగ్రేసరుడు |

| పద్యం | పదం | అర్థం |
|---|---|---|
| 87 | బెరయు | పొందు |
| 90 | సామేనిగఱిత | అర్ధశరీర నారి |
| 91 | నికాయము | దేహము,ఇల్లు, పరమాత్మ |
| | అదవదపడు | కలతపడు |
| 92 | వట్టిపాటు | నిష్ప్రయోజనము |
| 93 | ఎడలు | విసర్జించు |
| | రౌలు(రవులు) | కాలు |
| | కుంతుకొను | వ్యాపించు |
| 94 | మొప్పె | మూర్ఖుడు |
| 95 | మవ్వము | సుందరము |
| 97 | వేల్పుగిడ్డి | కామధేనువు |
| 103 | బరిచేక్కు | శత్రుషట్కము |
| 104 | అయిద...పట్ట | పంచకృత్య పరాయణ |
| | నలువు | సామర్థ్యము |
| | అయితి | శక్యము |
| | దంట | జంట |
| 105 | ప్రొద్దుపట్టి | యముడు |
| 106 | అల్ల | అమ్మ |
| 107 | పంతుగ | శ్రేష్ఠముగ |
| | కాఁత | కాపు (ఫలింపు) |
| | కిసుక | కృషి (సేద్యము) |
| 108 | యామ్యుడు | అగస్త్యుడు |
| | నీరువామి | సముద్రము |
| | తాఱు | పోవు, తొలగు |



కీ.శే.బ్రహ్మశ్రీ కవితా శేషయ్య గారు (పెదతండ్రి) స్మార్త ధర్మ శాస్త్ర పండితులు.
ధర్మపత్ని స్వర్గీయ వేంకట సుబ్బమ్మ గారు



కీ.శే. బ్రహ్మశ్రీ కవితా ఆంజనేయ శాస్త్రి గారు (పెదతండ్రి) వేద స్మార్త పండితులు.
ధర్మపత్ని స్వర్గీయ వేంకట సుబ్బమ్మ గారు



జననీ జనకులు వాస్తు జ్యోతిష విద్వాన్ కీ.శే. బ్రహ్మశ్రీ కవితా కామేశ్వర శర్మ సిద్ధాంతి గారు.
ధర్మపత్ని స్వర్గీయ రాజ్యలక్ష్మి గారు



# రచయిత పరిచయం

| | |
|---|---|
| రచయిత: | కవితా (వేంకట సూర్య నారాయణ) ప్రసాద్ |
| జననం: | 1955 |
| ఊరు: | అవనిగడ్డ, కృష్ణాజిల్లా (ఆం.ప్ర) |
| తల్లిదండ్రులు: | వాస్తు జ్యోతిష విద్వాన్, దైవజ్ఞరత్న బ్రహ్మశ్రీ కవితా కామేశ్వర శర్మ, రాజ్యలక్ష్మి. |
| చదువు: | MSc (chemistry), (PhD), PG Dip. (Appd. Statistics) స్కంధ త్రయ జ్యోతిషము (వారసత్వము). |
| వృత్తి: | D.G.M (retd.), ONGC. |
| అభినివేశము: | పద్య, వచన కవిత్వములు, కథారచన, వాస్తు జ్యోతిష ముహూర్త శాస్త్రములు. |
| రచనలు: | వివిధ పత్రికలలో పద్య గద్య కవితలు, కథలు, వ్యాసాలు, ఆకాశవాణి పద్య సమస్యాపూరణలు, వివిధ కవితా సంకలనములలో రచనలు. |
| గ్రంథములు: | శ్రీ రాజశేఖర శతకము, శ్రీ వేంకటేశ్వర ద్విశతి, కొరోన వారణార్థనా పద్యపంచాశిక కావవే కామేశ్వరీ!! (శతకము), ప్రవచన కవితా (౨) కవితలు (వచన కవితా సంపుటి), మాటవెలదులు (పరశ్శతకము), ప్రపద్యాపీడము (ఖండ పద్యకవితా సంపుటి), ఇష్టకథాష్టకము (కథాసంపుటి), శ్రీ లలితా మధురాక్కరలు ముహూర్త కామేశ్వరము, పచన కవితలు మొ. |